# శివోద్వాహము.

## నాంది.

---

శ్రీ విశ్వేశుఁడసంగుఁడయ్యు సమర ♦ క్షేమానుసంధాయియై
భావంబద్రి వరాత్మజాత రుచిర ♦ ప్రఖ్యాత శీలప్రభా
వావిర్భూత మనోరథంబునకు లో ♦ నై తాసగంబయ్యు లో
కావళ్యద్రి సుతామరోద్వహ దక్షుం ♦ డానంద మందించుతన్.

(నాంద్యంతమందు సూత్రధారుడు నలుగడల నవలోకించి)

ఆహా భూలోకకైలాసమగునీ వారణాసీ పురమున భుక్తిముక్తుల నిచ్చుచు బాలించు నీవిశ్వేశ్వరు లొసంగరాని దెయ్యది. ఎంతటి మహాపాతకుండు నిచ్చోట మేనొసరించి పరశివ సాయుజ్యము నొందునఁట సంతత భక్తితోడ దమ్ముపాసించువారి భాగ్యమేమనవచ్చు ధన్యుఁడనిన నతఁడేగదా. ఏలననిన,

క. అతులిత కవితా చతురత
నతులిడికై సేతసేసి ♦ నగ జనుజగ తీ
పతికి నొసఁగె బరిణయ కృతి
నతఁడును గైకొనియెదాని ♦ నతిముద మొదవన్. 2.

నటి—(సత్వరముగా బ్రవేశించి) భావా నేఁడు శ్రీవిశ్వేశ్వరుల మహాపూజ నోత్సవము జరుగునట మీరేల నిచట దడయుచున్నారు.

సూత్రి—మరియుతెస్స నేఁడు మహా సుదినము కవిభాగ్యము నట్టిదే ఆధునికులొనరించు రూపకములెన్నెన్ని ప్రదర్శింపలేదు. అందొక్కటియైన బండితుల కానందకరముగా నుండెనా?

ఉ. ఇంతిరో చూడు సంధిగుణ ♦ మెచ్చటనైనను గానరాక య
త్యంతములన్ బ్రవేశము ♦ లందలి కూర్పుల నేర్పులేక ని
శ్చింతత రూపకంబులని ♦ సీయనజేసెద రింతగాక నాం
ద్యంతమునందు సూత్రధరు ♦ డన్నను రూపకమౌనె యన్నియున్. 3.

నటి—విచారింపవలదు పండితులు నుతించునట్టి నాటకములు నయిత నాధునికకృతులం దున్నవి. మొన్ననే శ్రీ భువనేశ్వరమున నాడిన సుసేన విజయమును మీరు మ రచితిరా?

సూత్రి—అదియే చెప్పనుంటిని. ఆధునిక కవులలో నత డొక్కరుడే పండితులసంతో షింపజేయువాడు. సుసేన విజయమునకేమి మొన్ననే తన సద్గురులగుశ్రీ గోవిం దానంద సరస్వతీంద్రుల చరణకమలముల సేవింప నిచ్చటికి వచ్చి శ్రీవిశ్వేశ్వరు న కాహిమనంతునివలె దనకవితాకన్యకను శివోద్వాహమను రూపకమున సమర్పిం చెను. అదిగ్రంథరూపమునమాత్రము చూచితిని. ఇంతదనుక బండితసమావేశముగా నందున ప్రదర్శింపమానితిని.

నటి—పటుతర ప్రతిభావంతుడగు జల్లేపల్లిహనుమంతరాయ డొనరించిన దేదిలెస్సగాదు.

సూత్ర—సందియ మేమి చూడుము!

చ. బహువిధకల్పనా రచన ♦ పద్య మనోహరధార మాధురీ
మహిత పద ప్రచారము స ♦ మాహిత సద్గుణ శోభి రీతులున్
బహుళతరార్థ గౌరవము ♦ భావవికాసము లెల్ల నాతడే
సుహృదయులెల్ల మెప్పలిడు ♦ చొప్పన జేయునొరుల్ సమర్థులే. 4.

నేడుపురందరుం డాదిగాగల బృందారకులెల్ల మహేశ్వరుని బూజించు దినముగనుక శి వోద్వాహమే యుక్తమగు రూపకము. అదియే నేడీమహాపండిత సమాజమును రంజించు ను. పాత్రలనాయత్తము జేయుము.

నటి—నేడుఫాల్గుణ శుద్ధైకాదశియనియు మహేంద్రాది దిక్పాలురు తారకాసుర పీడి తులై మహాశివు నారాధించిన దినమనియు నెరిగియే శివోద్వాహమున బాత్రలనా యత్తముచేసి మీచిత్తమురయ వచ్చితిని. మీరు నదియే నియమించితిరి.

సూత్ర—నటీ! నాశిక్షలనొందిన నీవు కాలరసోచితముగ గాక మరియొకరీతి నెటులనూ హింతువు.

నటి—(తెరవంక జూచి) అయ్యో! అదిగో పూజ్యుడగు మహేంద్రుడు బ్రహ్మలోకమునుం

డీ హిమవంతుని జూడబోవుచు దిక్పాలురతో గూడి వచ్చుచున్నాడు. చూడుము. చూడుము.

చ. గనుము హిమంతశీతమున ♦ గాంచినబాధల కోర్వలేక చై
త్రుని దెసనాసపెట్టుకొని ♦ తోటలలో సుఖదుఃఖ మధ్యమై
తనరెడు ద్వంద్వముల్పగిది ♦ దారకు దాడికి బ్రహ్మమాటకున్
వనరుచు సంతసింపుచును ♦ వచ్చెడునల్లదె వజ్రి యీదెసన్. 5.

సూత్ర — నేను మిగులసంతసించితిని. వేషములు కడుసొంపుగానున్నవి. సపరివారుడై యింద్రుడీదెసనే వచ్చుచున్నాడు. మన మిచట మసలరాదు. రమ్ము. పోయి పిదపటి కార్యముల జక్కబెట్టుదము.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

ఇతి. ప్రస్తావన.

# శివోద్వాహము.

## ప్రథమాంకము.

ప్రదర్శనము:—ఇంద్రుడు, బృహస్పతి, దిక్పాలురు, హిమవత్ప్రాంతమున ప్రవేశించుచున్నారు.

ఇంద్రుడు—కమలాసనుని ధీరప్రశాంత వచనములు వినినపుడు మిగుల సంతసించితినిగాని యాతనివీడ్కొనినది మొదలు మరలదారకాసురపీడ మనమున శల్యమువలె బాధించుచున్నది. కటకటా! అమృతాశనుల కెట్టియిడుమలు వాటిల్లెను.

చ॥ పరువిడి భూసురోత్తమ త ♦ పఃపరిపూజన యాగకర్మలన్
సురతతి హవ్యమంద జను ♦ చో గడుకోపమునన్ హుతాత్తుగా
సురపరిపంథివర్గములు ♦ చుట్టికడంగ ననాథలైసురల్
మరలిన దామెబోయి యను ♦ మానములేక భుజింత్రు హవ్యముల్. 5.

సూర్యుడు—దేవనాథ! భూసురుల యాగాదికర్మముల వలన త్రిదశులకు హవ్యకవ్యము.లెక్కడ. ఏలననిన

శా॥ వేదాధీనములైన సత్క్రియలకు ♦ విఖ్యాతసాక్షిన్ననున్
గాదంచు న్బటు తారకోద్భట భటుల్ ♦ కాలంబులందప్ప స్వే
చ్ఛాధీనంబుగ ద్రిప్పికొందురకటా ♦ యాభూసురుల్వేల్చు హ
వ్యాదుల్ కాలముదప్పటన్ దితిసుతా ♦ హ్లాదంబె జేయున్ వెసన్ 7.

చంద్రుడు—లోకవ్యవహారార్థము కల్పింపబడిన చాంద్రమానము వ్యర్థమగుటయు నిం కొకటి చూడుము.

చ॥ సురరిపు దంపతుల్సురత ♦ శోభనవేళల వెన్నెలీన వ
స్వైరవునగట్టి యిండ్లకడ ♦ వెట్టుదు రచ్చట నుండియైన సుం
దర రమణీ ముఖంబులను ♦ దాటి వెలుంగగ రాదునాకు భూ
సురులకు బక్ష భేదములు ♦ చొప్పడవెన్నడు దేవపూజలన్ 8.

యముడు—ఎంతక్రూరకర్ములయినను రాక్షసాధములను విధ్యుక్తముగా దండింప నాకను వు పడదు. అందరికి నొకపద్ధతియు వారికిమాత్రమొకటియు ఏలననిన వారుబల వంతులుతారకాధముడిపుడు త్రిలోకాధిపతి పక్షపాత మెరుగక న్యాయమును బ్రవర్తింపజేయు నేనును రక్కసుల యెడల మిగులబక్షపాతము జూపవలసివచ్చె ను. ధర్మాధికారి మిగులవేగముగా నశించుటకు సులభమైన మార్గము పక్షపాతము వహించుటయే ఈవరుణుండు మంత్రహతవీర్యమగు మహోరగము చందమున దీనుడై యున్నవాడు. మహాత్ముడగు కుబేరుని మాట వేరజెప్పనేల. కొమ్మనరికిన మహాభూరుహమువలె తన గదనువిడిచి విన్ననైయున్న యీతని యాకృతియేతార కాసుర పీడను దెలియజేయుచున్నది. మరియును

ఉ॥ చిన్నతనంబునాడె తను ♦ జేరి సమస్త సుఖాయురున్నతుల్
సన్నుత దిక్పతిత్వము నొ ♦ సంగి కృపన్గనుగొన్న శంకరుం
డిన్నరవాహన ప్రకట ♦ హీనదశంగని మిన్నకుండుటల్
గన్నను కర్మ సూత్రమొ జ ♦ గంబున మేటి యటంచు నెంచెదన్ 9.

బృహస్పతి—వత్సా! లెస్సగా బలికితివి.

క॥ సకలలోకంబు లొక్కెడ
యొక త్రుటిలో బెలుచ గెలువ ♦ నోర్చిన ఘనుడున్
సకల సురావళి తోడను
గకవిక పడుటెల్లగాదె ♦ కర్మ ఫలంబుల్. 10.

అయినను రాజ్యతంత్ర విత్తములగు నీలోకపాలు లందరు లెస్సగా నాలోచించి కార్యము నిశ్చయింపుడు.

ఇం—దేవగురూ! సకల కళావిదులును నీతిశాస్త్రకారులునునగు మీకృపచేతగాదె లోక

పాలురు లోకపాలులగుట నేటికి తారకాధముడు పితామహ వరప్రభావంబున జెలరేగి లోకములనెల్ల నేచుచున్నాడు. దైవకృతియందు శాస్త్రాభిప్రాయము చెల్లదుకదా.

బృ—చెల్లకేమి నాడు వృత్రాసురుని వధించునపుడు సమయము వచ్చినందాక నాతనితో సంధిచేసి పిమ్మట జయశ్రీ లాభమును బొందితివిగదా. సమయమునకు దగునటుల సంచరించుచు శత్రువునదమున వంచించుట శాస్త్రాభిప్రాయమే.

కుబేరుడు—పలుమారు రాక్షసాధముల వలన నపచారముల దప్పించుకొంటిమిగాని తారకాంతకు డెవడును గానరాడు.

వరుణుడు—మనల నిక నెవ్వరు రక్షింపగలరు.

ఇం—నామనమున నించుకయు ధైర్యము లేకున్నది. బ్రహ్మనిష్ఠుడగు శివయోగి వివాహ మాడునా.

సూ—ఆడునుబో! కుసుమ కోమలియగు తన ముద్దుకూఁతు నా హిమవంతు డీ జడదారి కిచ్చునా

బృ—అందులకు వెరువవలదు. హిమవంతుని మనమందరము వేడికొనిన నియ్యకొనవచ్చును

ఇం—అటులైన సగము కార్యము సమ కూడినది.

బృ—అంతమాత్రమున సంతసింపకుము. శివు డనవరత తపోనిష్ఠుడు. అత డిందుల కంగీకరించుటయే యాలోచనీయము.

ఇం—దేగువరూ! నాకొకటితోచుచున్నది.

బృ—అదియేమి?

ఇం—మిగుల విలాసవతులును జాణలు నగు వారిపలన నీకార్యము చక్కబడుననితలచెదను.

బృ—(నవ్వుచు) తపోభంగము కార్యముకాదు. వివాహముసుమా. విశ్వామిత్రుడని యెంచుచున్నావా నీ మేనకాదివిలాసవతుల నాతడు కన్నెత్తి చూడనైన జూడడు. ఏలననిన,

చ॥ సంచలదూర్మితాపముల ♦ జయ్యన గెల్చిన యావిరాగి ని
శ్చంచల దృష్టి బ్రహ్మమును ♦ స్వాంతమునన్ గనుచున్మహద్వ్రతో
దంచితయోగి నిష్ఠుడయి ♦ హర్షమునొందు మహేశ యోగికా
మించునె మేనకాదులను ♦ మేటివిలాసము లెన్నిజూపినన్. . . . . 11

ఇం—మరియేమిచేయఁగలము.

బృ—మనమందరమేగి దేవకార్యము విన్నవించి తారకునిపీడలనుగ్గడించి వేడికొనిన నాతఁడు గాచును నాఁడు దేవహితార్థమున గాలకూటమును మ్రింగిన యాదేవుఁడీ చిన్నిపనికి వెనుకదీయఁడు.

ఇం—నన్ను మన్నింపుఁడు మీరానతిచ్చినది లెస్సగనున్నది. అయినను గార్యసాధనము గాదని తలంచెదను. ఏలననిన)

చ॥ త్రిదశ విరోధులందు గడు ♦ భీతిని జూపుచు నామహేశుడున్
సదయత వారుగోరునది ♦ సర్వమొసంగెడు వాఁడు క్రూరభ
స్మదనుజు నాత్మనాశనము ♦ సైతము నెంచక దన్పు దేవుఁడీ
త్రిదశుల నేచు దారకుని ♦ దేవవిరోధిని గీటడంచునే. 12.

య—రక్కసులందరును శివభక్తులు. వారియందాతనికి మిగుల దయగలదు.

బృ—ఓయీ పరేతరాజా! నీవు దెలియవైతివి.

ఉ॥ రాక్షస పక్షపాతియన ♦ రాదు మహేశ్వరుని న్నిజంబుగా
బక్షముగాన దేరియెడ ♦ బావనుఁడాతని జేరిమమ్ము సం
రక్షణ జేయుమంచు మది ♦ రంజిల వేఁడెడు వారికెల్ల దా
నక్షయసౌఖ్యమిచ్చెడు ద ♦ యాపరుఁ డీరలెరుంగరాతనిన్. 13.

ఇం—అయ్యా మరియొకటి తోఁచుచున్నది. ఇట్టి కార్యములందు మనమదనుని సహాయమావశ్యకము. అతఁడుపూనుకొనిన నీకార్యము సఫలమగును. పార్వతియందీశుని చిత్తము దవులునట్లొనరింప సమర్థుఁడాతఁడే.

య—ఆయంశమున నేను మిగుల శంకించుచున్నాను. మహేశ్వరుండు భక్తిచే నోడబడువాఁడుగాని పరాక్రమము, మోసముచే నోడబడువాఁడుగాఁడు. ఏలననిన,

చ॥ ఎరుగుదు కాలకాలుని య ♦ హీనపరాక్రమ మెల్లనేను మూ
న్నోరుపక యామృకండసుతు ♦ నింగొనబోయిన మూఁడుకన్నులన్
జూరచుర జూచుమాత్రమున ♦ జొప్పరిచచ్చితి దేవతావళుల్
మొరలిడగాచె నాథునుని ♦ ముంగిటమారుని దర్పమేటికిన్. 14

బృ—దేవరాజా? నేను నుడివినదే కర్తవ్యము.

ఇం—నాకు సందేహము గలుగుచున్నది పోనిండు ముందు కుసుమసాయకుని బంపుదము. అతనిచే నీపనిగాకున్న మనమందర మేగి వేడుకొందము.

బృ—(జనాన్తికముగా) ఏలనోగాని నేను జెప్పినదీతనికి రుచించినదికాదు. పోనిమ్ము నాకేల నేను జెప్పవలసినది చెప్పితిని. ఇంకనీతని చిత్తము ననుసరించి నడచుకొనియెదను. (ప్రకాశముగా) ముందు హిమవంతు నొప్పింపవలయునుగదా.

ఇం—అవునవును. ఆదిత్యాదు లెటుల నూహింతురో?

సూ—దేవనాథ? నీవచనమును దేవగురునానతియు నేవారికి బూజనీయములుగావు.

ఇం—గురువరా? దేవహితము నాశీర్వచించి యిదియే నిశ్చితకార్యమని ముందుమీముఖమున బలుకుడు.

బృ—ఇప్పటికిదియే నిశ్చితకార్యము.

ఇం—త్రిదశులంద రనుగ్రహింపబడిరి. ఇక హిమవంతుని కడకెవరిని బంపుదము.

బృ—ఎవరినంపుట నీవేపోవలయును.

కం॥ తనవలయు గార్యసాధన
మున నొరులను బనుప జనదు ♦ పురుషునకెందున్
బనిచిస్వకార్యమ్మును జెరు
చును బుద్ధివిహీను డరయ ♦ సోమరియగుచున్. 15

ఇం—అతడీయంశమున నేమనునో?

బృ—నావచనమమోఘము. నీవు శంకింపవలదు మనమీమాటలసందున నోషధీప్రస్థముదరియంజొచ్చితిమి. అల్లదె దూరమున హిమవంతుండు కూర్చొనియున్నవాడు నీవేగుము మేముఁదివంబున కేగెదము. (అని నిష్క్రమించుచున్నారు.)

ఇం—(కొంతనడచి) అదిగో హిమవంతుడును మేనకయు నెద్దియో యాలోచించుకొను నట్లున్నది. నేనిటు దిరిగిపోయెదను. (అని పోవుచున్నాడు)

2 ప్రదర్శనము:—ఓషధీప్రస్థము. హిమవంతుడు, మేనకయు బ్రవేశించుచున్నారు.

మే—ఔనౌను నేనేమిచేయగలను? ఎంతచెప్పినను వినకున్నది.

హి—వినకున్నదని యెంతకాలము మనముపేక్షింపవచ్చును తనపట్టిన పట్టువలన నామన సెంత నొచ్చుచున్నదో తానూహింపదు ఆడుబిడ్డ కలకాలము పుట్టినింటనే యుం

డదు కదా! ఎచ్చటనైన దగినవరుని జూచు ప్రయత్నము జేయుదమన్న దీనిపూనిక ముజ్జగములందును దెలిసినదే.

మే—నాథా!

ఉ॥ ఏలను లేతకూన నిటు ♦ లెంచుట యుక్తముకాదు పెండ్లియే
మేలనిదోఁచ దానికి స ♦ మీహితకార్యము చక్కనయ్యెడుఁ
గాలము కొంచెమేగినను ♦ గల్గును జవ్వనమింక లెస్సయై
కాలముబట్టి మారుపులు ♦ గల్గును కోర్కెల నెల్లవారికిఁ. 16

హి—వెర్రిదానా!

కం॥ నినుబట్టి దానిసైతము
ననుమానించెదవుకాని ♦ యరయవుతరుణీ
మనముద్దుకూతు చిత్తము
ఘనదృఢమగుటెల్ల మున్న ♦ గంటిని నేనుఁ. 17

మే—నాకుమాత్రము వేరుగా దోచుచున్నది. వివాహము వలదనుటకు నొకకారణము గలుగును. నేనెంతయడిగినను జెప్పకున్నది. కాని తానెవరినో మనమున నిడికొని యాతని బొందనగునో? లేదో? యను సందేహముచే నిటులనుచున్నదని తలచెదను.

హి—ఆసంగతి సువ్యక్తముగా బలుకకుండుటకు గారణమేమి! తనవలసినవాఁడశనాచ్ఛాదన శూన్యుడైనను, విషమదర్శనుఁడైనను, స్థాణుఁడైనను, సర్వేశ్వరుని గాను, నిర్జితమదనునిగాను, సర్వజ్ఞునిగాను, నేను సంభావింపజాలనా! తన మనమున నంతయుదాఁచుకొనిన నేనేమిచేయఁగలను.

మే—అటుగాక తేటతెల్లముగ నంతయు దానెపలుకునా. వాతోడనైనను జెప్ప మోమోటమును. ఆడువారిచిత్తము మిక్కిలిమెత్తనయని జేలనగునను జూచి మీరెంచుచున్నారు.

హి—ఔనౌను, నీవేమియు నెఱుంగని ముద్దరాలవు నిన్నుసైతము నీవెఱుంగవు. మే, న, యను నీ పేరె దెలుపుచున్నది.

మే—అందువలననే స్థిరప్రజ్ఞా ప్రభావులగు శైలనాథులు నన్ను వరించుట.

హి—ఏమినీపాండిత్యము? మంచిది నీ పేరుపెట్టుకొనిన మాత్రమున దేవవనితయగు మేన యెకంతవిలాసవతియో జూడుము.

మే—అందున దప్పేమి. అహంకారరహితులకెన్ని విలాసములైనను జెల్లును.

హి—నీచాతురి పాండిత్యముకన్న మించినది పోనిమ్ము తక్కినవనితల చిత్తవృత్తి యెట్టిది?

మే—అది యెవరికిదెలియును.

ఉ॥ ఎంతసుఖంబు గల్గియు న ♦ దెంతటి శోకముగల్గినేని మీ
రెంతధనంబొసంగియు మ ♦ రెంతగ వేడియు బుజ్జగించియుఞ్
సుంతయువాసిచూప రతి ♦ చోద్యములోన నడంతురంతయుఞ్
గాంతల చిత్తవృత్తులను ♦ గానగనేర్తురె యెంతవారలున్. 18

హి—సుందరీ ఈయంశము నీవుచెప్పితివిగావున లోకమంతయు నమ్మును మరియేరీతిని దానిమనసు నందలి కోరికదెలియనగును.

మే—నేనే కాలక్రమమున దాని చెలులవలన నంతయు దెలిసికొనియెదను. సమయము వచ్చినపుడు నీయిచ్చవచ్చిన వానికి నిన్నిత్తురని మీజనకులు పలికిరనియును జెప్పవచ్చునుగదా.

హి—సందియమేమి ! తానుకోరినవరుడు నాకును బూజనీయుడే. హిమవంతుని కూతురను దప్పవడునా చూడుము.

మ॥ గిరిసంఘాతములోన మిన్న ననుచుఞ్ ♦ గీర్తింతురి యోగీశ్వరుల్
శరణంబంది ఫలంబుగాంత్రు కులముఞ్ ♦ సద్వంశమైశ్వర్యముఞ్
వరరత్నాకరమెల్ల సౌఖ్యములు నా ♦ వశ్యంబులైయుండనీ
గిరిజఞ్ బెండిలినేసి గాంతును త్రిలో ♦ కీవ్యాపి విఖ్యాతులఞ్. 19

(నారదుడు ప్రవేశించుచున్నాడు.)

అదిగో భగవంతుడగు నారదమహాముని ఓరీ యెవరక్కడ.

(దౌవారికుడు ప్రవేశించి) దేవా ఇదిగోయున్నాను.

హి—లోనికిజని పూజ్యులగు నారదమహామునుల బూజింప బూజాద్రవ్యముల గొనిరమ్మని పార్వతితో జెప్పుము.

దౌ—మహాప్రసాదము.(అనిపోవుచున్నాడు)

హి & మేనక— లేచి యెదురేగి మహాత్మా ఇదె హిమవంతుడు సభార్యుండై మీచరణకమలముల కభివాదమొనరించుచున్నాడు. (అని యిద్దరు సాష్టాంగముగా నమస్కరించుచున్నారు.)

నా.—నారాయణ, నారాయణ, (నవ్వుచు) ఓయీ శైలరాజా భార్యాసహితుడవై మాత్రమె నమస్కరించితివి.

హి.—దేవరవారిని సత్కరింప బూజాద్రవ్యముల గొనిరానియమింపబడినది పార్వతి.

పా.—(పూజాద్రవ్యములతో బ్రవేశించి) దేవా! త్రిలోకజ్ఞానుభావా! హిమవత్పుత్రి త్రిలోక కల్యాణదంబులగు మీచరణారవిందంబులకు సాష్టాంగ వందనంబు నొనరించుచున్నది. (అని సాష్టాంగముగా నమస్కరించుచున్నది.)

నా.—(లేవనెత్తి శిరముమూర్కొని) లోకోత్తర చరితుడగు వరుని బడయుము గౌరీని నుసలమనంతలోనవె వచ్చితివి దీర్ఘాయుష్మతియు, సంతతసర్వమంగళయు న గుము.

హి.—అది కేవలయాశీర్వాదమెకాదు వరమె.

మే.—అనుగ్రహింపబడితిమి.

హి.—ఈయర్ఘ్య పాద్యములగైకొని మునిసత్తములీ యాసనమలంకరింతురుగాక.

నా.—(అటులజేసి) మీరును గూర్చుండుడు గిరిరాజా బ్రహ్మలోకమునుండియింద్రలోకమునకు బోవుచు మార్గమున నిన్నుజూడ వచ్చితిని నేను వచ్చువరకెద్దియో పలుకుచుంటివి అది యేమి.

హి.—హిమవంతుడీ కుశలప్రశ్నచే ననుగ్రహింపబడెను మరేమియును లేదు పార్వతీ వివాహమునుగురించి ముచ్చటించుచూ మేనతో నిట్లంటిని.

మ॥ గిరిసంఘాతములోన మిన్ననుచుణ్ ♦ గీర్తిగాంతుగ్రి యోగీశ్వరుల్
శరణంబంది ఫలంబుగాంతుగ్రి వలముణ్ ♦ సద్వంశ మైశ్వర్యమున్
వరరత్నాకర మెల్లసౌఖ్యములు నా ♦ వశ్యంబులై యుండనీ
గిరిజన్ బెండిలిసేసిగాంతును ద్రిలో ♦ కీవ్యాపి విఖ్యాతులన్.

నా.—తలిదండ్రుల కీరీతి ప్రీతిసహజమే కదా నాకును బార్వతీ పరిణయ మహోత్సవము చూచువేడుక మెండుగాగలదు ఏమినిశ్చయించితివి.

దౌవారికుడు ప్రవేశించి—దేవా ప్రాగ్దిశానాధులు శచీకాంతులు దర్శనమపేక్షించి వచ్చియున్నారు.

హి.—సత్వరముగా దోడుకొనిరమ్ము

దౌ.—చిత్తము (అని పోవుచున్నాడు.)

నా—(జనాన్తికముగా) మంచిసమయముననే వచ్చినాడు ఇతఁడీయంశము నెటుల బ్రస్తావించునో చూచెదను.

(ఇంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

హి—(లేచి యెదురుకొని) దేవనాథ ఈయాసనమును గైకొని యీయర్ఘ్య పాద్యములఁగొనుము.

ఇం—(నారదునిజూచి) ఆహా! ఏమినాభాగ్యము! నారదమహాముని సందర్శనము సమకూడినది దేవసంయమీ నావందనములుగైకొనుము.

నా—సంతతాఖండల సామ్రాజ్యసిద్ధియగుగాక.

ఇం—(తనలో) ఈమహాత్ముఁడు త్రికాలవేది సంతతకలహప్రియుఁడు నేను వచ్చుటకు మునుపే యీయంశమును దెలిపియుండఁడుగదా- అయిననేమి నేనైనను దెలుపవలసినదే (ప్రకాశముగా) దేవా త్రిలోకసంచారులగు మీకు కుశలమా.

నా—క॥ త్రిదశేంద్రసుఖము నాకె
ట్లొదవును ముల్లోకములకు ♦ నొక్కటదీన
త్వదశల దారకపీడను
హృదయమ్ముల శోకమెపుడు ♦ నెచ్చుచునుండన్. 21

హి—తారకాసురునిపీడ లోకములంతట వ్యాపించుచున్నది అఖండసామ్రాజ్య శోభితుఁడగు నీశచీకాంతుని యాకారమే సాక్షి చూడుఁడు!

క॥ కరము కృశించిన గాత్రము
పరతేజోవిజి తదీన ♦ వదనము హీన
స్వరమును తారకపీడా
భరమును దమయంతదామె ♦ పలిపెడునకటా. 22

ఇం—నగరాజ జగద్రక్షా దక్షులగు నినువంటి మహాత్ములారక చూచుచుండి తారకాధముఁడు ముల్లోకముల బాధించుటకు గారణ మరయనేల.

నా—(జనాన్తికముగా) అదిగో మెల్ల నారంభించెను కానిమ్ము కొంతతడవీతనినాడించెదను. (ప్రకాశముగా) ఓయీ తన కుమారకావివాహాలోచనజేయు నీతని మనమును దేవతాదైన్యముచే గలంక జెట్టకుము.

ఇం—పరమానందము నామిత్రుని పుత్రికకు బరిణయం బొనరింప నాలోచించుటచే దేవతా దైన్యమును మరతును సకలసద్గుణవతియును భువనమోహినియునగు నీకన్నియకు బరిణయంబగుట గనులార నెన్నడు చూచెదమని యమరులందరు నాసగొనియున్నవారు ఈపుణ్యశీలకుం దగిన వరుని నిర్ణయించితిరా ?

నా—వివాహమె వలదని పార్వతి నిశ్చయించినట్లు వింటిని ఇది నిక్కమా.

హి—మరేమి.

ఇం—నీయభిప్రాయ మెటులనున్నది.

హి—వేరెటులనుండును తగిన వరునకిచ్చి కృతార్థుడ నయ్యెదనని తలంచుచున్నాను.

నా—వంశపావనులు మరియేతీరున దలతురు అయిన నీతనియభిప్రాయముతో బనియేమి పార్వతి వివాహము వలదని నిశ్చయించినది.

ఇం—నీ మనమున నెవ్వరికీ కన్నియ నిచ్చి ధన్యునిజేయ నెంచితివి.

నా—అదియే యాలోచనీయము.

ఇం—(తనలో) ఏమిది ఈతడు మాటిమాటికి నడ్డుతగిలి విరసమాడుచున్నాడు. నే ననుమానించినటులనే యీతడు పూనుకొనినట్లున్నది. కానిమ్ము ఈతని సరకు సేయనేల (ప్రకాశముగా) మిత్రమా! ఎవరినైనను దలచుకొని యుండవా.

నా—వివాహాంశమున బురుషుల యాలోచనకంటె స్త్రీలయాలోచన బలముగదా.

ఇం—ప్రియసఖీ మేనకమాత్రము నీయాలోచన నంగీకరింప కుండునా.

మే—మీయందరి సమ్మతమే నాకును సమ్మతము

ఇం—(జనాంతికముగా) ఇపుడీశ్వరుని యందీతని చిత్తముదవిలె నేని లోకములన్నియు సుఖించును గదా.

నా—ఓయీ! ఈవరకేమయిన గురుశుశ్రూషణ మొనరించినదా పార్వతి?

హి—లేదు.

నా—ఇంకను పసిబిడ్డ. కొంతకాలము గురుజనపరిచర్య జేసెనేని సహజగుణవతి యగు నీమె సానబట్టిన రత్నమువలె బ్రకాశించును.

ఇం—(తనలో) నేనువచ్చినవేళ మంచిదికాదు. కాకున్న నారదుండేల నిచ్చటికి వచ్చెను. (ప్రకాశముగా) మునీంద్రా! ఈమె సయుక్తము శుశ్రూషణ మొనరింపం దగినవారెవ్వరు?

పా—(తనలో) జరామరణ వర్జితులగు శివయోగీంద్రులు.

నా—త్రిలోకనాథుఁడగు శివయోగి తప మొనరించుచున్నవాఁడట !

ఇం—అబ్బా! రుద్రుఁడా! అతఁ డెక్కడ ఈపసిబిడ్డ యెక్కడ. అతికోపఘనుఁడగు నాతని యొద్ద నుపచర్య యనిన గత్తులపై సాములే. అయిన నొకటి గలదు సుమా. ఈమె పరిచర్యవలన నతఁడానందించునే గాని కోపింపఁడని తలచెదను. ఇదివరకాతని యీమ మఱి వడసితిరా.

నా—(తనలో) ఔరా! ఈతని స్వకార్య నిర్వహణ నైపుణి. (ప్రకాశముగా) అతఁడంగీకరింపకేమి.

ఇంద్రు—పార్వతి మనోరథము నరయుఁడు.

నా—అమ్మా! లజ్జవలదు. దూర్వాసకోటిసముఁడగు నా శివయోగికడ నించుక కాలము పరిచర్య యొనరించి యాతని కరుణ వడయుదువా?

మే—అమ్మా! కులగురువు లడుగునప్పు డూరకుండరాదు. చెప్పుము.

పా—కన్నియలకు గురుజనోపసత్తి శ్రేయమే కదా! శతకోటి దూర్వాస సములైనను లోకానుగ్రహ ధురీణులగు నమ్మహాత్ములు భక్తితోడ గొలుచువారిని వర మొసఁగి ప్రోవకుందురే?

ఇం—(తనలో) విబుధులారా! ధన్యులైతిరి. (ప్రకాశముగా) మిత్రుఁడా! నీవంశమంతయు నీయసమసంభవముచేఁ బవిత్రమాయెను. సహజధైర్యధుర్యుఁడవగు నీపుత్రికకు శివకోప మొక పెద్దగాదు.

నా—అమ్మా! నీవేల నారీతి బలికితివి ?

పా—దేవా! నేనమ్మహాత్ముని గురించి యిటుల వింటిని.

చ॥ అలిగినయేని ముజ్జగము ♦ నాతనిముంగిట నిల్వనోప ద
య్యలఘుఁడు నేరముండిన భ ♦ యంకరుఁడై గనుపట్టు నూరకే
యలగున భక్తులందున మ ♦ హాత్ముల చిత్తము కారణంబుగాఁ
జలనమునొంద దొందినను ♦ శాంతిలు బాదముబట్టి వేడినన్.

అందువలన నట్లంటిని.

నా—(తనలో) భువనేశ్వరి, త్రిలోకనాథుని పరిచర్యకు వెనుకదీయునా? (ప్రకాశముగా) ఓయీ ఈమెను శివయోగికడ దప్పక నొప్పగింపుము.

ఇం—ఇంక నొకటిగలదు. శివయోగి నీయింటనే స్థాణ్వాశ్రమ మను తపోవనమున యోగనిష్ఠుఁడైయున్నవాడు. నీయింట నిశ్చలముగా దప మొనరించుచుండుటచే త నీ మెవలని పరిచర్య నతిమోదముతో నంగీకరించును.

హి—(ఆశ్చర్యముతో) ఏమీ! మహేశ్వరుఁడు నాయింటనే తపంబొనరించు చున్నవాఁడా? నే నెరుంగనైతిని. నాభాగ్య మేమని కొనియాడుదును. ఇదియంతయు బాగుగనే యున్నది. ఇంక నాలోచింప వలయును.

ఇ—నీయెడఁగల స్నేహమే పార్వతీ పరిణయమును జూచువేడుక బురి గొలుపుచున్నది. మిత్రి సందర్శనమును మాత్రము గోరివచ్చిన నాకిచట బార్వతీపరిణ యాలాపమును, నారద సందర్శనమునుగూడ సమకూడినవి. ఇట్టిసమయమున నాదురవస్థ నుగ్గడింపరాదు. మరియొకసారి వచ్చెదను. మునీంద్రా నావందనములు గైకొనుము.

మిత్రమా! పోయివచ్చెదను.

(నిష్క్రమించుచున్నాడు.)

హి—ప్రియసఖి! అంతయు వింటివిగదా.

మే—గురువచనము సర్వధా శ్రేయస్కరము.

నా—ఓయీ! నే నెంతో తడ విచ్చట మసలితిని. అదిగో చూచితివా యీమాటల సందున నింద్రునితో మాటాడ మరచితిని. ఇపుడే పోయెదను. (తనలో) ఇపుడీరహస్యమును వెల్లడిచేయ నదనుగాదు. చేసితినేని మరి కలహము గలుగదు. స్వలాభము పోవును. (లేచుచున్నాఁడు.)

(అందరు నమస్కరించుచున్నారు.)

నా—మీకు శుభము గలుగుగాక, పోయివచ్చెదను.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

3 ప్రదర్శనము.— హిమవత్కూటమునందు మందాకినీ తీరమున నొకలతాగృహము.

(పార్వతి, చందనిక, కస్తూరికయు బ్రవేశించుచున్నారు.)

—(పార్వతి వైపుజూచి) ఓసీ! దాచుకొనుము, దాచుకొనుము. ఎంతకాలము దాచుకొందువు? అప్పుడైనను దెలియకుండునా? ఆనాఁ డెవరు నిన్నలంకరింతురో చూచెదముగాక. చంధనికా! యెటువంటి రహస్యమును సుఖదుఃఖములనుసమముగా

బంచుకొను చెలులకు దెలుపకుండ దాచుకొనుదానిని ఘరియెవ్వతె నయిన జూచితివే?

చ—ఇంతమాత్రమునకే తమప్రాణములవలె బ్రియమైన చెలులపై కోపింపదగునా! పాపము ఇది యేమి దాచుకొనినది.

పా—మీరెంత వగల వంకాయలే! ఏదో యొక నెపము గల్పించుకొని నాయెడ నొకరు కోపగించుట మరియొకరు వెనుక వేసికొని వచ్చునట్లభినయించుచు నెక్కసక్కియముల నాడుట, ఆహా! మీరెంతవారలే మీ మాటలు నేను వినను.

క—నీకెంత కోపమె? ఆమహాకాళి యైనను నీకు గోపమున దీసిపోవును. పోనిమ్ము. ఇటుమీద నీసమాచార మడిగితినేని యొట్టుబెట్టుము. చందనికా! (అని చెవిలో జెప్పుచున్నది)

పా—అదిగో నన్ను మోసముచేసి యేమో గొణుగుచున్నారు. నాకుఁ జెప్పరుకదా!

క—నీవు మాత్రము మాకు జెప్పితివా?

చ—చెలియా నేను జెప్పెదను, కస్తూరికతో నేమి

క—నీవు చెప్పవలదు. ఒట్టు బెట్టితిని తన గుట్టు మాత్రము రహస్యమా?

పా—ఓసీ! నేనేమి దాచితిని.

చ—ఆరీతిని దారికి రమ్ము.

క— నిన్నను మనయింటిలో జరిగిన సమాచారమేమి?

పా— మనయింట జరిగినది నీవెరుగవే? నిన్నను నారదమహాముని యును మహేంద్రుడును వచ్చి యాతిథ్యము నంగీకరించి చనిరి.

క—అంతేనా? వారిరువురును మాటాడకూరక పోయిరి కాబోలును!

చ— ఓసీ! నీవెపుడు నీరీతిని కస్తూరికకాకకు బాలుపడుదువు. అపుడు జరిగినదంతయు నుడువరాదా.

క—నీవు చల్లనిబానవుగదా. నన్నేల నుగ్గడించెదవు. అపు డేప్రసంగమును రాలేదు. పార్వతి చెప్పినది వినలేదా.

పా—అవునే అపుడు నా వివాహమును గురించిన ప్రసంగము వచ్చినది. అయిననేమి?

చ—ఆమాట మొదటనే చెప్పిన నెంత బాగుగ నుండును.

క—సఖీ! నీమీది ప్రేమచేత దెలియగోరితిని. నాకోపమును మన్నింపుము.

చ—నీవివాహ ప్రసంగ మెట్లు ముగిసెను.

క—ఇంచుకేనియు నెడలేక మేను మేనున గలిసి నీవు సుఖించు పుణ్యాత్ముని పేరు నుడివి నీ సఖీజనులకు శ్రవణానందము గలుగఁజేయుము.

పా—నేను వివాహమె వలదంటిని.

క—నీ చక్కదనమునకు దగినవరుడు లేడని నిశ్చయించితివా?

చ—పూజ్యులగు తండ్రిగా రేమనిరి?

పా—వారంవరు నించుకకాలము గురుజనసేవ జేయవలయునని నిర్ణయించిరి.

చ—నీ వందులకు సమ్మతించితివా?

పా—పెద్దలట్లు విధియన సమ్మతించక జేయవలసిన దేమి.

చ—ఎవరియొద్దను?

పా—స్థాణ్వాశ్రమమున నఁట.

క—ఇంకేమి నీ పుణ్యము పండినది. నీవిదివరకు విన్నమహాత్ముని, గనుగన్నులార జూచి సేవించెదవు. పిమ్మట నీవెవరో మేమెవరో.

పా—చందనికా! చూచితివా దీని పరిహాసములు

క—నేను పరిహాసమాడితినా! నిక్కమే పలికితిని. అన్యాయముగా నన్నేల నాడుకొనియెదవు

చ—శివయోగీశ్వరుని కటాక్షము వడసి యష్టైశ్వర్యములఁ బొందెదవు. కస్తూరికమాత్ర మింతకన్న నేమనినది.

క—అతడు రుద్రుఁడు. ఆతని పరిచర్యవలన నీమెయు రుద్రాణి యగును.

పా—నీ స్వభావ మెపుడు నొకటియే. చందనికా! మీరేమి మాటాడుకొనిరి.

చ—అమ్మా నాకెందుకు దానినే యడుగుము. అది యెట్లు బెట్టినది.

పా—ప్రియసఖి, కస్తూరికా! నాకుఁ జెప్పవే.

క—నీకు, జెప్పరానిదేమున్నది. నీవివాహ ప్రసంగము నీవుదాచుటచేత నీ పెండిలినాడు నిన్నలంకరింప గొంత తడవు త్రిప్పలు బెట్టుదమని మే మనుకొంటిమి. అయిన నిపు డంతయు జెప్పితివి గనుక మరి యటుల జేయము.

పా—నాకు వివాహ మయినపుడుగదా చూచెదములే.

చ—ఓసీ చూఁడు చూఁడు! ఎవరో మహర్షి మందాకిని యందీదుచున్నాఁడు.

క—ఔనౌను మహాతేజోవంతునివలె నున్నాఁడు.

పా—(హృదయోద్వేగము నణఁచుకొనుచు) ఈమహాత్ముని చక్కఁదనమేమని వర్ణింతును ఆహాహా.

చ॥ జిగిబిగిగల్గు దేహమును ♦ జిక్కనిమాంసలమైన వక్షమున్
ధగధగలాడు జవ్వనము ♦ నల్లనిబారెడు జుట్టువెండ్రుకల్
నిగనిగలాడు చెక్కులును ♦ నిద్దపుజూపు విశాలఫాలమున్
జగమున నందమెల్ల గురు ♦ సంయమియందున నుంచెధాతయున్. 24

ఈతఁడు నిక్కముగా శివయోగికాకున్నె నేను విన్నటులనే యున్నవాఁడు. ఆ, తప్పకాతఁడే. ఈతఁడు తనయౌవనమును దపమునఁబెట్టుకున్న నిక స్త్రీలకు శీలమెక్కఁడ.

ఉ॥ ఆమహనీయుబొంది యన ♦ యమ్ము సుఖింపగనోచినట్టి యా
రామదె పూర్ణసౌఖ్యము పు ♦ రాకృత పుణ్యఫలంబుదానిదే
నామనమెల్ల నీభువన ♦ నాథునియందున నిల్చెశ్రీశివ
స్వామియితండె యైన బరి ♦ చర్యలనైననుగాంతుసౌఖ్యముల్. 25

చ—నీవేమి యోచించుచున్నావు.

పా—అమ్మహాత్ముఁడు మందాకిని యందెటుల నోలలాడుచున్నాఁడో చూడుము.

క—యోచించుటేమి ఆతఁడోలలాడుట మాత్రము చూచుచున్నది. పార్వతీ వివాహమాడనని ప్రతినఁబట్టిన దెరుఁగవా.

పా—(తనలో) ఇటువంటి శివయోగీంద్రులఁగాక వేరొకరిని వివాహమాడనంటినిగాని పెండ్లియేమాని యోగిని నగుదునని యంటినా.

చ—నేనాసంగతిమరచి యేమో ధ్యానించుచుండుటచేత నడిగితిని.

క—ఇఁకను చాలింపుఁడు. అదిగో తీరమునెక్కుచున్నాఁడు. ఆమహర్షి యతికోపనుఁడు. ఎవరో తెలియునా? మరెవరునుగాదు. శివయోగి మనలనుజూచెనేని శపించును.

పా—(తనలో) హృదయమా నిక్కముగా నీపుణ్యమిపుడు పండినది. కస్తూరికా! ఆమహాపురుషుఁడు శివయోగీంద్రుఁడని తెలిసిన నీకంటె బ్రాణదానముఁజేయువారు మరి యెవరు?

చ—ఓసీ! ఆతఁడీదెసనే వచ్చుచున్నాఁడు.

క—లెండు లెండు. అతనికంటబడక మరియొక దెసను బోవుదము.

పా—(తనలో) అయ్యయో ఎట్లుపోగలను.

చ—పార్వతీ లెమ్ము లెమ్ము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

4 ప్రదర్శనము:—హిమవత్పర్వత శిఖరముఁ నారదుఁడు ప్రవేశించుచున్నాడు.

నా—త్రిలోక పూజనీయుఁడగు నన్నును దిరస్కరించెను. తాను దెలుపకున్న నాకు దెలియదుకాబోలు! ఎందువలననోగాని ననుజూచి లోకమంతయు గలహాశనుడ ననియు గలహప్రియుడననియు నన్యాయముగా నాడుకొందురు. ఔనౌను తమ నేరము లొరులపైబెట్టుట లోకసాధారణమే కదా తెలివిలేక తమలో దాము పోరాడుచుండునపు డించుక నాకు సంతోషమే. అదికాదనను. కాకున్న నేనుగూడ వారితో గలహింపవలయునా లేక యేడువవలయునా. నేనెన్నడైన గావలయునని కయ్యములు పెట్టితినా. ఇతరులు కలహించునపుడు చూచి సంతోషింతునుగాని దానిని జల్లార్పను. చల్లార్పవలయునని వేతనమొసంగి నన్నెవ్వరేని నియమించిరా యేమి. తపముచేసికొను నాకధికప్రసంగమేల! ఇదియేగదా నావలని నేరము మరియు నందరివలె మాట కడుపునదాచుకోనేరను నాచెవిని బడినమాట మరి నిముసమునకందరికి దెలియును నాకు దాపరికమేల! అందువలన వారిలో వారు కలహింతురేకాని నావలన నేరమేమి గలదు. నేనేమి యింటింటికిబోయి మీమీరహస్యములను నాకుజెప్పుడని బ్రతిమాలుదునా తమంతట దామె నాతోడ నుడువనేల నేనేమో కలహము పెట్టుదుననియేగదా సుత్రాముడు నాతో దెలుపకుండుట నేనేమి దేవకార్యమునకు విఘ్నముగలిగింతునా నాచేతనయినంతదనుక దనకు సహాయము నే చేసియుందునే నాడు హిమవంతునింట దాను దెలుపకయే నేనెంత సహాయముచేసితిని. అదియైన నెంచక నన్నింత చుల్కనజేయునా పార్వతీ వివాహముజూచు వేడుకమాత్రముదప్ప మరేమియు లేదనెనుగాని దేవకంటకుడగు దారకాసురుని గీటడంప శివవీర్యమువలన బార్వతియందు సేనాన్యుని బుట్టింపయత్నించుచున్నామని తెలుపడయ్యె. ఔరా! వీని దొంగతనము నేనుత్రికాలవేదినని మరిచెను. కానిమ్ము పాకశాసనా ఇఁకను నారదుని ప్రభావము జూడుము ఈయంశమున నించుక యలికిడిబుట్టింపకున్న నే

ను నారదుడనుగాను (యించుకాలోచన నభినయించి) అయిన నీయిందుప్రియం దలి పంతముచే దేవకార్యము చెడునుగాబోలు (మరల నాలోచన నభినయించి) మంచిది యిటులజేసెదను అదిగో చూపుదూరమున నొకకూటమున హిమవంతుడు మేనకతోగూర్చొనియున్నాడు మూడువంతులు హైమవతిని శివయోగికడ కంపుటనుగురించియే యోచించుచుందురు ఇందుప్రియు సైతము పార్వతిని శివగివయోగికడ కంపుడని వారల నుత్సహించును. నేను లేకుండజూచి వారితో మాటాడుటకే గాబోలును మరియొకసారి వచ్చెదననియంచు బోయెను తానటులనే సంతోషింపనిమ్ము నేను శివయోగికడకేగి నాపనిజేసెదను. అపుడు వాసవుడు నాసంగతి లెస్సగాదెలియును త్వరపడి స్థాణ్వాశ్రమమున కేగెదను.

(అని నిష్క్రమించుచున్నాడు)

5 ప్రదర్శనము—హిమవంతుడును మేనకయు నొకకూటమునగూర్చొని ప్రవేశించుచున్నారు.

హి—అప్పటి కెటులదోచినను దుష్కరముగా గనబడుచున్నది.

మే—పార్వతికిసైతమిది సమ్మతము.

హి—అదియెట్లు.

మే—స్పష్టముగా బలుకలేదు అయినను వివాహ మిపుడక్కరలేదనియు నింక గొంతకాలము గురుజనసేవ జేయుదుననియు పిదప వివాహాలోచన జేయవచ్చుననియు ననెను.

హి—ఇందుకా నీవానందించుచున్నావు.

మే—ఇప్పటి కిదియును మేలె.

హి—మహేశునిసంగతి యెరుగదు అందువలన నీసాహసము.

మే—ఆమహాత్ముడు త్రిలోకనాధుడు అతనిని బరిచర్యలచే దనిపి తగినవరుని బొందుటకు వరముగొనవచ్చును.

హి—సకలసుఖముల ననుభవించుచు జెలులతో నాడుకొనుచుండు నీపసిబిడ్డ యతికోపనుడగు నాశివయోగికడ బరిచర్యనెటుల నొనరింపగలదు.

మే—ఆయంశమున నాకును మనము తల్లడిల్లుచున్నది. కుసుమకోమలమగు దనశరీరమును బరిచర్యశాలుసేసిన నేనుమాత్రమెటుల సహింపగలను,

హి.—(తెరవంక జూచి) అదిగో శతమఖుఁడు విలాసార్థముగాఁబోలు నిటువచ్చు
చున్నాఁడు.

మే.—మనలను జూచెనుగాఁబోలు నీదెసనే వచ్చుచున్నాఁడు.

హి.—మొన్న నింకొకసారివచ్చి మాటాడెదననెను.

మే.—అందునకే వచ్చునని తలచెదను.

హి.—ఎద్దియో పనిగలిగియేవచ్చును. (ఇంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు) మిత్రుఁడా రమ్ము.
ఈశిలావేదికపై గూర్చుండుము సాయంకాలమున విలాసార్థము బయలువెడలి
నట్లున్నది.

ఇం.—(తనలో) ఇదియునొక మేలె కానిమ్ము (ప్రకాశముగా) మిత్రుఁడా నీసానుప్రలం
దొకతూరి తిరిగి విశ్రాంతినొందవచ్చితిని జన్మసాఫల్యమనిన నీదేగదా చూడుము.

చ॥ ఒకదెసగంగ యొక్కదెస ♦ నోషధిసంచయ మొక్కచోమణీ
ప్రకటితభాగ్యవైభవము ♦ ప్రాప్తతపఃఫలమన్నిచోటులం
దొకటవిహారభూములును ♦ నొక్కటనున్నతకూటజాలముల్
సుకృతియనంగ నీవొకడ ♦ సూవెజగత్త్రితయంబు జూచినన్. 26

హి.—ఓయీ నేనంత నతిపాత్రుఁడనుగాను నీవంటివారి కుపచరించుటవలన ధన్యుఁడ
నైతిని కాకున్న నేనునొక శైలమునే.

ఇం.—అదిగో ఉపచరించుట యనని స్మరించితిని ముల్లోకములను దారకుని కప్పగించి
చూచుచున్నావేగాని యమరుల దీనదశకించుకైన నడ్డురావుగదా.

హి.—తారకునివలన బీడలేనివారెవరు నాశిఖరములలో గొన్నింటిని దన యుద్యానము
లలో నుంచుకొనెను. అయిన నేనేమిచేయగలను ఈపని నీవలన గావలెననుము
నేను చేసెదను.

ఇం.—నీవు దలచినమాత్రమున దారకుఁడు చల్లారును.

హి.—అది యేలాగు.

ఇం.—నీయధిత్యకయందొకచోట శివయోగి తపమొనరించుచున్నవాఁడు గదా.

హి.—ఔ నవును నేనాతని సందర్శింప వలయును.

ఇం.—అతని వీర్యమువలన బుట్టినవాఁడుగాక తారకాంతకుఁడు లేఁడు.

హి.—అందునకు నేనేమి చేయగలను.

శిరి.—వినుము ఆమహాత్మని వీర్యమునుధరింప హైమవతికిదప్ప మరియొవరికిని సమర్థత లేదు. కావున హైమవతికిని శివయోగికిని వివాహకార్యము సాధింపుడని గమలాసనుడె నాతోడ బలికెను.

హి. & మే.—(ఆశ్చర్యముతో నొండొరులఁ జూచుకొనుచున్నారు)

ఇం.—మీరు శంకింపవలదు.

హి.—సందేహింపలేదు మాభాగ్యమున కచ్చెరువందుచున్నాము.

ఇం.—అందువలననే నీయుపేక్షచే దేవతలకీ దైన్యమంటెని.

హి.—నాచే నేమగును సుస్థిరబ్రహ్మ నిష్ఠుడైయున్న రుద్రునికడ కెవరేగ గలరు. ఇదిగాక యాడుబిడ్డవారము గదా. మాయంతట మేమేపోయి పిల్లనిచ్చెదమని యడుగుటనాయ్యముకాదు. కానిమ్ము కాలక్రమమున జూచుకొందము.

ఇం.—అదేమి శుశ్రూషణార్థము పార్వతినంపదలచిన దేమాయెను.

హి.—మరల సందేహించుచున్నాను.

ఇం.—వలదు వలదు. పంపుము, అందువలన నన్నియు సమకూరును నేనంతయు దీర్చెదను నీవుమాత్రి మామెనచటికంపుము.

హి.—మేనకా ప్రియసఖుడిట్లనుచున్నాడు నీ వేమనియెదవు?

మే.—నాకును మనస్సొప్పకున్నది. అయినను ప్రియసఖుని మాటదాటరాదని శంకించుచున్నాను.

ఇం.—దేవకార్యార్థమే కాక త్రిలోకోద్ధరణార్థమీ కార్యము మీరుచేయక తప్పదు నాస్నేహబలముచే మిమ్మును నిరోధించుచున్నాను.

హి.—అంతదూరము చెప్పినపుడు మనము కాదనరాదు. మిత్రుడా కానిమ్ము రేపు శివయోగిని సందర్శించెదను. పార్వతి నొప్పగించెదను.

ఇం.—అదిలెస్స. పిమ్మటి కార్యము నేను దీర్చెదను. మిత్రుడా! మనమీ మాటలసందున మురచితిమి నీ మిత్రుడనగు నాయెడ నీవలెనే నీయెడల నాదిత్యుడు మిత్రధర్మమును జూపుచున్నాడు.

చ॥ ఎడపక నీ గృహంబుననె ♦ యెచ్చులు తగ్గులు గల్గె గాన దా
నొడయుడవైన నీకు నవి ♦ యొప్పగ బంచ దలంచి మిత్రుడా
పడమట నించె నీ యెడల ♦ బచ్చని బంగరు చాయ నింతయూ
బుడమిసమాన భాగ్యులయి ♦ పొందుదురన్నియు మిత్రవర్గముల్

హి.—అవును సంధ్య వర్తిల్లుచున్నది.
శిం.—లెమ్ము నేనును బోయెదను. దేవర మాతోడ నీ వచటి కేగవలయును.

(అందరు నిష్క్రమించుచున్నారు)

ఇది శ్రీ జల్లేపల్లి హనుమన్త్రాయ కవిరచితమగు శివోద్వాహ
మను నాటకమున వాసవమంత్రణమనునది
ప్రథమాఙ్కము.

# శివోద్వాహము.

## ద్వితీయాఙ్కము.

1 ప్రదేశము:—స్థాణ్వాశ్రమము. శివయోగి యొక్క యోగవేదికపైఁ గూర్చొని

ప్రవేశించుచున్నాడు.

శి.—ఆహాహా! ఆత్మానుసంధానమునకంటె సుఖమేమి గలదు. నా స్వరూపమునందువల న లెస్సగా నెరిగి యానందించుచున్నాను.

చ॥ కదిసి చరాచరాత్మక జ ♦ గంబునకెల్లను మూలకారణం
బిదియని నిర్ణయింతు రది ♦ యెయ్యది నేనెగదా మహేశుఁడన్
సదృశు డెవండు నా కఖిల ♦ సాక్షికి నేనను లోన జూచుచున్
ముదమును బొందువాడ బరి ♦ పూర్ణుఁడ నవ్యయుఁ డద్వితీయుఁడన్. 28.

సకలలోకములను సృజియించుచు బాలించుచు గిట్టించుచు నానందించు పరమేశ్వరుండు నే నేగదా అనుసంధానమునుండి మరలినపుడుమాత్రమె యీప్రపంచమును గుర్తెరుగుట. అంతదనుక ననుభవించిన సుఖమిట్టిదని యనుభవవేద్యమేగాని మాటలతో వక్కాణించి చెప్ప నలవికాదు. ఎంతకాలమైన నీరీతి గడుప వచ్చును. నాతోడ సంతతానంద మనుభవించు దాక్షాయణితండ్రి వలని పరాభవము సైపక యగ్నిప్రవేశము జేసెను. సకలావతారములందును నాతోడ ననపాయ దాంపత్యము నెనయు నమ్మహాశక్తి లేకుండుటవలన సమాధి చాలించినపుడెల్ల నాకు సంతోషము లేకున్నది. అయినను సమాధినిష్ట మాత్రమధికముగా నున్నది. (చెవియొగ్గి) ఓరీ ఎవరక్కడ

నంది—(ప్రవేశించి) దేవా ఇదిగో యున్నాను.

శి—ద్వారమున గోలాహలమేమి?

నం—మహాదేవా! త్రిలోకసంచారులగు నారదమహామునులు దేవర దర్శనార్థము వి చ్చేసియున్నారు. తాము సమాధి యందుండుటంజేసి లోనికి బోరాదని విన్నవించుచుంటిని. అందులకు వారునాపై గినియు చున్నారే గాని మరేమియు గోలాహలములేదు.

శి—వారి నెన్నడును వారింపవలదు. తోడనే ప్రవేశపెట్టుము.

న—మహాప్రసాదము ఇంతటినుండి మరెన్నడునడ్డము. (అనిపోవుచున్నాడు.)

నా—(ప్రవేశించి) అదిగో శివయోగి మున్ననే యీమహాత్మునిజూచియు నేటికి క్రొత్తవానివలె తేజమధికమయి మిగుల బ్రకాశించుచున్నాడు. ఆహా సైదిక తేజోమహిమ.

చ॥ పసిడిమెరుంగుమై జిగితం ♦ పంబున వన్నెలు మించి కాంతి న
ల్దెసలను గ్రమ్మి చూపరుల ♦ దృష్టుల నింపుగబట్టి లాగెడున్
వెసజని చేర బోవ గడు ♦ వేడిమిచే మిరుమిట్లు గొల్పు హా
యసదృశయోగి దర్శనము ♦ లద్దిరసాంప్రను భీతి గొల్పవే. 29.

క॥ మానిత యోగాభ్యాసము
పూని యితడుకడు బురాణ ♦ పూరుషుఁడయ్యున్
మేనిపసలేత ప్రాయము
గానంబడు బెండ్లికొమరు ♦ కైవడి నాకున్. 30

శి—మహాముని! నావందనములుగై కొని యీవేదికమీద కూర్చుండుము.

నా—నారాయణ! (కూర్చొని) మహాదేవా! సకలతపఃఫలమనగు నీకును దపమేల లోకములనెల్ల నిరుపద్రవముగా గాపాడుదొరవు నీవకావె! మహానుభావా,

క॥ విశ్వములగన్నమేటివి
శాశ్వత సుఖమొరులకీయ ♦ జాలిన దొరవున్
శాశ్వత సుఖస్వరూపివి
విశ్వేశా యింక నేల ♦ వేడితపంబుల్. 31

శి—నారదా! స్వరూపానుసంధానమునకంటె వేరేమున్నది? చూడుము,

శా॥ నానాబుద్ధిగతావరోధచయము ♦ న్నాశంబుగావించు స
న్మానంబిచ్చును చిత్తమందుఘన చాం ♦ చల్యంబు బోనాడు ని
త్యానందంబుదయింపఁజేయును స్వ ♦ కీయంబైన యాత్మానుసం
ధానానందముకన్న వేరుకలదా ♦ ధ్యానింపఁగానారదా. 32

నా—మహాత్మా! నీస్వరూపమేది? దాక్షాయణీ సహితమా? తద్విరహితమా?

శి—అన్నియు నెఱిగి నన్నడుగనేల? దాక్షాయణీరహితుఁడనై నేనెటులసంచరింపఁగలను.

క॥ అన్ని యవతారములలో
జెన్నుగ ననపాయస్ఫూర్తి ♦ జెలగుచునన్నున్
మన్నించును దాక్షాయణి
చన్నేనే దానివిడిచి ♦ చరియింపంగన్. 33

నా—ఇపుడు మరి దాక్షాయణియేది?

శి—నా మాయయేగదా దాక్షాయణి. ఎపుడువలసిన నపుడుగైకొందును.

నా—ప్రకృతమందవిచ్ఛిన్నముఁగా దపమొనరించుచున్నావా?

శి—మఱేమి.

నా—నీకు శుభముగలుగుగాక నేనొకటి చెప్పెదను వినుము ఎవరేని దపముబూనిన ముందు దేవేంద్రునికి భీతిగలుగును. వాని తపోభంగమున కాతఁడెన్నియేని బన్నును. కావున దపోవిఘ్నము రాకుండ మెలఁగవలయును.

శి—నారదఋషి లోకాచార ప్రవర్తకుఁడవగు నీవచనము పరమోపదేశముగా గైకొందును. అయినను దన పదమునుగోరి తపమొనరించునపుడు గోత్రభేదికి భయముగలుగుట నిక్కమె. వేలకొలది నింద్రులను దలపుమాత్రమున సృజింపజాలునా కింద్రునివలన విఘ్నమెటుల గలుగును.

నా—నీయభిప్రాయ మాతఁడెఱిఁగెనేని విఘ్నమాచరింపఁడు అయినను సాధారణముగా నింద్రపదవిఁగోరి తపము జేయుచుందురు గావున నెవరు తపముబూనిన దన పదమునకేయని యతఁడనుమానించి భయపడును. ఇది లోకసామాన్యమే కదా.

శి—నీ కనుమానము వలదు.

నా—నా కనుమానమేల నాయెరిగినమాట జెప్పితిని. పోనిమ్ము, దానికేమి. మహాదేవా ఈ యాయాశ్రమమున నీకు సుఖముగా నున్నదా. నీపరిచర్య చేయువారెవరు.

శి—ప్రమథులు.

నా—అదియు నొకమేలె.

శి—ఏల?

నా—ప్రమదలేమోయని శంకించితిని. అదికాదుగనుక నిపుడంతయు సంతోషమే.

శి—ఉండిన నేమి.

నా—ముందెందరినో మహాపురుషుల నింద్రుఁడు తనకామినుల నెరసేసి తపోభంగ మొనరించెను.

శి—ఏలనన్నింత చులకనజేయుచున్నావు మృత్యుంజయుఁడనని యెఱుగవా?

నా—దేవా, మఱవలేదు. మృత్యువును జయించినను గురంగలోచనల చూపుల జయించుట మిగుల దుష్కరము నీవే యోచింపుము. (ఆత్మగతముగా) ఇట్టువంటి మహాయోగులె చక్కనియాఁడుదాని మోముజూచినమాత్రాన నుప్పొంగి వెంటనంటి పరువులిడుట వేరె వెతుక నేల? ఈమృత్యుంజయుఁడె పురుషుఁడని యెరిగి యెరిగి యాఁడుదానివేషమును ధరించినమాత్రమున వెన్నుని వెంటనంటి పజ్జనున్న దాక్షాయణి నగునని సైతమనుమానించక కడుదవ్వు పరువులిడెను. ఆమాట గట్టిగా నంటిసేని నిష్ఠూరముగా నుండును. పెద్దవారితప్పులు వారియెదుట నే పలికిన చిత్తము బరువెక్కును గదా.

శి—నీవు మాత్రము మిగుల శంకించు చున్నావు గాని నాతపమునకు విఘ్నము రానేరదని నమ్ముము. అదియునుగాక ప్రచ్ఛన్నముగా నేనీయాశ్రమమున నున్నానని నన్నెవరెఱుగుదురు?

నా—నీవటుల ననుకొనుచున్నావు. నీవెవనియింట నిశ్చలముగా దపమొనరించు చున్నావో యాహిమవంతునికొక చక్కనికూఁతురుగలదు. ఆమె మూఁడులోకములందును సుందరియగుటచేత భువనేశ్వరి యనదగియున్నది. ఆమెకిపుడు జవ్వనము నిండుచున్నది. హిమవంతుఁడు నామెను గొంతకాలమింక గురుజన శుశ్రూషణము జేయవలయునని నిశ్చయించి నీవిచ్చట నుండుట నింద్రునివలన నెరిగి నిన్ను సందర్శింపఁ దలచెను. అతడు పార్వతిని దోడ్కొని రేపిచ్చటికి వచ్చును. ఎవరైన

కృష్ణు—మనము మాత్రము తడయ నేల ? (రథము మరల్చి నడపుచు) అదుగో! పెద్దబావగారు సంతోష పారవశ్యము చేత భీమునితోఁ గూడ నామడ యడుగులుగఁ గాలినడకనె మన కెదురు వచ్చుచున్నారు. మన మిఁక రథము దిగి యాయనను గలిసికొందము.

ఇద్దఱు—(రథము దిగుదురు.)

యుధి—(భీమునితోఁ బ్రవేశించి కృష్ణునిఁ గౌగిలించుకొని) వాసుదేవా!

గీ. పగలు తుదితంతుగూడ నిష్ఫల మొనర్చి
విజయు ప్రతినము నెగ్గించి, విజయ మొదవఁ
జేసినమహాత్మ్మ నిన్ను నర్చింపనిమ్ము
ప్రథమమున నాదు సంతోష బాష్పములను.

అర్జు—అన్నగారు ! విజయుఁడు నమస్కరించుచున్నాఁడు.

యుధి—(కౌఁగిలించుకొని) తండ్రీ ! నిర్వర్తితప్రతిజ్ఞుండవై నిరుపద్రవముగ వచ్చి నాకుఁ గన్నులపండువ సలిపితివి!

భీము—అహో ! అదే మదేమి ! ఘటోత్కచుఁడు రక్తసిక్తాంబరుఁడై కపాలపాణివలె నెవనిదో మస్తకము చేతఁ బట్టుకొని యంబరము నుండి దిగుచున్నాఁడు !

అందఱు—(తొట్రుపాటుతోఁ బరికింతురు)

ఘటో—(ఉక్తప్రకారముగఁ బ్రవేశించి) తండ్రులారా ! సైంధవ రూపధారియై మిమ్ములను వ్యాకులపఱిచిన యలంబసునిరక్తముచే దడిసిన కేలుదోయితో మీకుమారుఁడు నమస్కరించుచున్నాఁడు. (నమస్కరించి) ఇదె యాదుష్టుని మస్తకము. (అని మస్తకము క్రిందఁ బడ వైచుచుఁ బ్రక్కకుఁ జూచి) ఇదుగో ! మామగారును నిక్కడనే యున్నవారా ! (అని కృష్ణునకు నమస్కరించును.)

యుధి—ఏమీ ! యీ మాయకాఁడలంబసుఁడా ! బిడ్డా ! యీ పాపాత్మునకుఁ దగినశిక్ష కావించితివి !

కృష్ణు—వత్సా ! నీతండ్రి లోకకంటకుఁడగు బకుం జంప—నీవు వాని యనుజుం జంపి యాతండ్రికిఁ దగిన కొమరుఁడ వనిపించుకొన్నాఁడవు ! బావగారు ! ఇక్కడికి విజయుని ప్రతిజ్ఞ నెఱవేఱినది.

ఈ సైంధవవధకుఁ బ్రథమప్రేరకురాలు మాచెల్లెలు. కావున నీ సంతోషవార్త యామె కెఱిఁగించుటకై శీఘ్రముగాఁ బోవలసి యున్నది. ఇఁక నేను జేయవలసిన దేమని యున్నచో సెలవిండు.

యుధి—ఇంకను నాకుఁ జేయవలసిన దేమున్నది ! ఈయనుగ్రహము నా మాతృభూమియెడ వినియోగింపుము.

కృష్ణ—అట్లయిన, నిదిగో !—

సీ. అన్నదమ్ములభాగ మపహరించెడుబుద్ధి
యెవ్వఁ నెరికి బుట్టకుండు గాక !
గాండీవి కెనవచ్చు కార్యశూరులతోడ
నిఖిలమండలములు నిండుఁ గాక !
అధికాయురోపేతు లానభిమన్యు లిం
టింట నెల్లవు డుదయింత్రు గాక !
కాంతలెల్లరు వృద్ధగతి వీరమాత లై
గౌరవకీర్తులు గాంత్రు గాక !

ప్రజలయం దైకమత్యము ప్రబలుఁ గాక !
విద్యకే గౌరవంబు లభించుఁ గాక !
కవులవాక్కులకు స్సిద్ధి కలుగుఁ గాక !
భరతమాత సుఖస్థితిఁ బరఁగుఁ గాక !

శ్రీ మజ్జగద్గురు శంకరభగవత్పాద ప్రసాదాసాదిత మహాకవిబిరుదాంక
భారద్వాజ గోత్రార్ణవ శశాంక, కవిఘంటా కలాప హస్త
కాళ్లకూర్యన్వయప్రశస్త, బంగారురాజ కవిరాజ
తనూజ, నారాయణరాయామాత్యబిడౌజ,
ప్రణీతంబగు పద్మవ్యూహనాటకము
సంపూర్ణము.